# పీఠిక




(అంకితం)










"నమో పిత్రే జన్మదాత్రే సర్వదేవ మయాయచ।
సుఖదాయ ప్రసన్నాయ సుప్రీతాయ మహాత్మనే॥"

మనకు విధించబడిన పంచయజ్ఞాలలో 'పితృయజ్ఞం' ఒకటి. "**దేవకార్యాదపి సదా పితృకార్యం విశిష్యతే**" అని స్మృతులు ఘోషిస్తున్నాయి. పితరులను శ్రాద్ధతర్పణాదుల ద్వారా తృప్తిపరిస్తే దేవతలు ఇచ్చే వరాలను మించి శీఘ్రతః ఫలాలను అందిస్తారు.

ప్రస్తుత గ్రంథంలో ఋగ్వేదశ్రాద్ధప్రక్రియను చక్కగా పరిచయం చేయడం జరిగినది. మా పితరులకు పుణ్యలోకాలు ప్రాప్తించాలని వారి అనుగ్రహం మా కుటుంబాలన్నింటిపై ఉండాలని కోరుకొంటూ **'ఋగ్వేద శ్రాద్ధ దర్పణమ్'** అనే ఈ గ్రంథాన్ని మా నాన్నగారు కీ॥శే॥పార్నంది సుబ్రహ్మణ్యశర్మగారికి అంకితం చేస్తున్నాను.

ఈ గ్రంథంలో సంస్కృత శబ్దాదులను నిశితంగా పరిశీలించిన సంస్కృత పండితులు బ్రహ్మశ్రీ బొంతా భాను ప్రకాశ శర్మగారికి,వేదభాగాన్ని క్షుణ్ణంగా పరిశీలించిన ద్వారకా తిరుమల దేవస్థానం ఋగ్వేద సలక్షణ ఘనాపాఠి బ్రహ్మశ్రీ చందుకూడ్ల హొసమనె రత్నాకర శర్మగారికి నా స్వాధ్యాయుడు దర్భముళ్ళ రామకృష్ణ శర్మకు నేనెంతో కృతజ్ఞుణ్ణి.

**బుధ విధేయుడు**

**పార్నంది ఫణీంద్ర శ్రీనివాస శర్మ**

# తెలుసుకోవలసిన విషయములు

ప్రేతమునుగాని,పితరులనుగాని ఉద్దేశించి శ్రద్ధతో భోజన పదార్థాదికములు సమర్పించుటే శ్రాద్ధము.శ్రాద్ధకాలమునందు శ్రాద్ధములను చేయువారికి ఆయుష్షు , బలము, ప్రజ్ఞ,కీర్తి, సంతానము, లక్ష్మీ ఇవి వృద్ధినొందుతాయి. శ్రాద్ధములందు పితృస్థాన బ్రాహ్మణునకు దక్షిణ ద్విగుణము ఇవ్వవలయును. భూసంస్కారముచేసి శ్రాద్ధము పిట్టవలెను. స్వగృహమందు మంచిది. పరగృహమందు శ్రాద్ధము పెట్టిన యెడల ఆ గృహయజమాని అనుమతిని పొంది కొంత రుసుము చెల్లించి పెట్టవలెను.గోమయాదులచే భూమిని భాండములను కడుగవలెను. దేవతలకు,యతులకు, బ్రహ్మచారులకు,శిశువులకును పిండదానము అగువరకు అన్నము పెట్టకుండా ఉండవలెను. మిక్కిలి బాలురకు మరియొక గృహమునందు అన్నము పెట్టవచ్చును.ఒక వస్త్రము ధరించి,జలమధ్యమున, దిబ్బయందు,మేడ మొదలగువాని అంతస్తులపైని మరియు తాను అశుచి ఐనపుడు శ్రాద్ధము చేయరాదు. గ్రహణదినమందు పిత్రాదుల ఆబ్దికము ప్రాప్తించినచో అన్నముచేతనే చేయువలెను.పాకమును శ్రాద్ధకర్త స్వయముగానే చేయవలెను.సంభవింపని చో పత్నియు ఆమెలేనిచో బంధువులును చేయవచ్చును. జారిణియు, వంధ్యయు, విధవయు, భిన్నగోత్రురాలు, పితృమాతృవంశ సంబంధము లేనిదియగు స్త్రీలు శ్రాద్ధపాకము చేయకూడదు.భోక్తలలో ఇద్దరుబ్రాహ్మణులు దొరకనపుడు పితృస్థానమందు ఒకరిని ఉంచవలెను,విశ్వేదేవస్థానమున పాత్రయందు ఆవాహనాదులను గావించి వ్యంజనాది సహితముగా పదార్థమునంతయు పాత్రయందుంచి ఆ పదార్థమును దేవునికి నివేదనచేసి అగ్నిహోత్రమున ఉంచవలెను లేదా బ్రహ్మచారికి పెట్టవలెను.బ్రాహ్మణుడు దొరకని యెడల యధావిధిగా శ్రాద్ధమును జరిపి అన్నమును ఎక్కడ బ్రాహ్మణుడుదొరికితే అక్కడకి తీసుకొనివెళ్లి దక్షిణసహితముగా యివ్వవలెను, కాని లోపముచేయరాదు.

శ్రాద్ధమును ఏదోవిధముగా జరుపవలెను.ద్రవ్యములేనియెడల ఉపవాసము చేయవలెను,శ్రాద్ధసంహితను పఠించవలెను,వృక్షమూలమునందు నిలబడి బాహువులనెత్తి సూర్యాది దేవతలను ఉద్దేశించి నాకు ధనములేదు వస్త్రము లేదు,శ్రాద్ధద్రవ్యములేదు 'పితరులకు నమస్కారము' నేను బాహువులను ఎత్తినాను పితరులు దీనితో తృప్తినొందుదురుగాక అని అనవలెను.

ఇద్దరు సోదరులును,తండ్రి కుమారులును,పూర్వభోక్తయు,పరదినమందు శ్రాద్ధమును పెట్టువాడును,శవముతో వెళ్లినవాడు,స్నాతకులు,గ్రుడ్డివాడు, యతీశ్వరులు,వికలాంగులు,బ్రహ్మచారియు,సోమయాజియు శ్రాద్ధభోక్తలకు యోగ్యులుకారు.

ఏకకాలమందు మృతులైనవారికి శ్రాద్ధములు వచ్చినపుడు అశక్తుడైనవాడు పాకము ఒకటియేచేయించి సంబంధక్రమముగా శ్రాద్ధములను పెట్టవలెను. తల్లిదండ్రులలో మొదట తండ్రిది తరువాత తల్లిది పెట్టవలెను.

శ్రాద్ధమును సంకల్పించి క్షణము ఇచ్చి పాదప్రక్షాళనము ఆచరించిన తరువాత ఆశౌచము వినబడినయెడల ఆశౌచము లేదు.పాదప్రక్షాళనమునకు పూర్వము వినబడినయెడల ఆశౌచమును గ్రహించవలయును,శ్రాద్ధమును మానవలయును.శ్రాద్ధమునకు పూర్వమే ఆశౌచము వచ్చినయెడల ఆశౌచము యొక్క శుద్ధియందు శ్రాద్ధమును పెట్టవలెను.మృతాశౌచమునందు 13వ దినమందు,గ్రస్తాస్తమయ గ్రహణమందు పరదినమందును శ్రాద్ధమును పెట్టవలెను.జాతాశౌచమందు 11వ దినమందు శ్రాద్ధమును పెట్టవలెను.ఒకవేళ తన ఇంటియందే జాతాశౌచము గలిగినయెడల 12వ దినమందు శ్రాద్ధము పెట్టవలెను. అప్పుడుకూడా వీలులేనియెడల అమావాస్యయందు పెట్టవలెను.

మాసికము ఆశౌచదూషితమైనయెడల అనంతరము తిరిగి ఆ మాసతిథి యందు పెట్టవలెను.ఆబ్దికమును ఆశౌచానంతరము ఏకాదశియందుగాని, అమావాస్యయందుగాని పెట్టవలెను.

పిండదానముగాక పూర్వము పితృబ్రాహ్మణుడు వాంతిచేసినయెడల ఆ దినమందే తిరిగి పాకముజేసి పెట్టవలెను.

పిల్లి,కుక్క,నక్క,గాడిద,ఎలుక, అస్పృశ్యుడు వీరు ముట్టుకొన్నను,పిండము విడిపోయునను ప్రాజాపత్యముచేసి తిరిగి స్నానముచేసి ఆ వండిన పదార్థములతోనే మరళ పిండములనుచేసి ప్రదానము చేయవలెను. కాకి ముట్టుకున్నను దోషము లేదు. సపిండీకరణములలో శేషము మిగలక పోవచ్చును అప్పుడు పిందములను కలుపుపనికి ఆటంకము వచ్చును అందుచేత ప్రాయశ్చిత్తముచేసికొని అవసరము ఐనచో తిరిగి వండి సపిండీకరణము చేయవలెను. ఇటువంటి ఇబ్బందులు వచ్చునేమోనని ఆపస్తంబుడు రాత్రివేళ శ్రాద్ధము చేయరాదనెను. ఒకవేళ గ్రహణ సమయములలో చేసినను విప్రభోజనము వరకు మాత్రమేనని తరువాత కర్త ఉపవాసముండి మిగిలిన పిండప్రదానాదులు మరునాడు చేయవలెనని చెప్పెను. మాసికములందును,గయాశ్రాద్ధమందును,మహాలయమందును, ఆబ్దికమందు పితృబ్రాహ్మణుడు పిండప్రదానములోపల వాంతి చేసినను తిరిగి శ్రాద్ధము పెట్టవలెను. పిండప్రదానము తరువాత ఏ దోషము లేదు. మరళ శ్రాద్ధము చేయనవసరము లేదు.

శ్రాద్ధభోక్తలు పరస్పరము స్పృశించినయెడల ఆ అన్నమును పరిత్యజింపక భుజించి తరువాత స్నానముచేసి ఎనిమిదివందలు గాయత్రీ జపించవలెను. ఉచ్ఛిష్టము యొక్క స్పర్శ కలిగినయెడల అన్యజలముతో ప్రక్షాళనచేసి భోజనానంతరము స్నానముచేసి మూడువందలు గాయత్రీ జపము చేయవలెను. ఉచ్ఛిష్ట స్పర్శమునందు ఆ తాకబడిన పాత్రను విడిచి ముందువలే సమస్త పదార్థములను వడ్డించి భోక్తలను భుజింపచేయవలెను.

సోదరులు విభక్తులు ఐనయెడల ప్రత్యాబ్దికాదులను వేరువేరుగా పెట్టవలెను. అవిభక్తులైన యెడల జ్యేష్ఠుడు చేసినయెడల అందరు చేసినవారగుదురు. అవిభక్తులుగా ఉన్నంతవరకు అనుజుల అనుమతినిపొంది జ్యేష్ఠుడు కర్మ చేయవలెను. ద్రవ్యము ద్వారా ఫలము కనుక అందరును చేసినవారగుదురు. విభక్తులైన తరువాత ఆబ్దికాదులు వేరుగా చేయవలెను, కలిసి పెట్టినయెడల పతితులగుదురు.

శ్రాద్ధ స్థలములో చెప్పులు,గొడుగు,ఎర్రబట్ట,ఎర్రపూలు,పిల్లి ఉండరాదు. శ్రాద్ధ దినమున ఆ శ్రాద్ధము పూర్తికాకుండ దానము,అధ్యయనము, దేవతార్చనము,జపము,హోమము,వ్రతాదికములు ఇవి చేయరాదు.తెల్లని బట్టలు గోచిపోసి కట్టుకొని శ్రాద్ధము చేయవలెను.గోచిలేకుండ పంచెకట్టి ఉత్తరీయము లేకుండ చేయరాదు.తడిబట్టలతో ఆబ్దికాదులు చేయరాదు. రంగుబట్టలు పనికిరావు.కుట్టుబట్టలు కూడా పనికిరావు.

ఉపనయనముకానివారు,స్త్రీలు,శూద్రులు శ్రాద్ధమును చేయునపుడు యజ్ఞోపవీత స్థానమున ఉత్తరీయమును వాడవలెను.

మురికి చెరువులలో నీరు,దుర్వాసనగలవి,నురుగుదేరినవి,ఉప్పువి, బురదగానున్నవి,గుంటలలోనివి,గోవులుముట్టినవి,రాత్రియే తీసుకొని రాబడినవి స్నానమునకు,పానమునకు మరియు వంటకు పనికిరానివి. గంగాజలమును చాలా రోజులకు ముందు తెచ్చినను శూద్రులు ముట్టు కున్నను స్నానపానాదులకు సర్వదా పవిత్రము.

చండాలాదులు చూచిన అన్నము అపవిత్రము.గత్యంతరములేనిచో మట్టితోగాని, భస్మముతోగాని, బంగారముమీది నుండి జారు నీటితోగాని శుద్ధిపరచుకొనవచ్చును.అపవిత్రమైన అన్నమును కూశ్మాండ మంత్రముల తోను,పవమానసూక్తములతోను,'తరత్సమ' మంత్రములతోను శుద్ధి చేయవలెను.

ఊనమాసికములందు, నిత్యశ్రాద్ధమందు, నైమిత్తిక శ్రాద్ధములందును ఉత్కర్ష ,అపకర్ష పనికిరాదు.(ఉత్కర్ష అంటే గతించిన దానిని తిరిగి చేయుట, అపకర్ష అంటే రాగల దానిని ఇప్పుడే చేయుట)

ఆబ్దిక శ్రాద్ధములందు తాతగారు జీవించియుండగా తండ్రి చనిపోయిన యెడల తండ్రికి రెండు పిండములు,తండ్రిగారి తాతకు ఒక పిండమును పెట్టవలెను.తన భార్య రజస్వల ఐననూ ప్రత్యాబ్దికము మొదలు శ్రాద్ధములను మానకూడదు.

శ్రాద్ధమందు అష్టార్ఘ్యములు అనగా పాలు,పెరుగు,నేయి,తిలలు,అక్షతలు, ఆవాలు,దర్భలు,పుష్పాలు అవుతాయి.

మృతాహము అనగా తద్దినము అంటే ఆదినమని అర్ధము. శ్రాద్ధదినమందు కర్త దంతధావనమును, తాంబూలమును, క్షౌరమును, అభ్యంగనమును,ఉపవాసమును,మైధునమును,మందును,పరాన్నమును కూడదు. భోక్త రెండవమారు భోజనమును,అభ్యంగమును, దానమును, ప్రతిగ్రహమును,హోమమును శ్రాద్ధదినమందు చేయరాదు.

పూర్వదినమందు సాయం హోమానంతరము కర్త తాను భుజింపక ఉండి భుజించి ఉన్న బ్రాహ్మణులను నిమంత్రణ చేయవలెను. నిమంత్రణ మును స్వయముగా తానుగాని,పుత్రుడుగాని,శిష్యుడుగాని చేయవలెను. ఈ నిమంత్రణము పూర్వదినమందు సంప్రాప్తించని యెడల శ్రాద్ధదినమందు ప్రాతఃకాలమందు చేయవలెను. అదికూడా కుదరనియెడల కుతపకాలమందు (మధ్యాహ్నమందు) చేయవలెను. శ్రాద్ధదినమందు మాధ్యాహ్నిక స్నానముచేసి సంధ్యావందనము చేసి శ్రాద్ధమును ప్రారంభించవలెను.

శ్రాద్ధ పిండములను బ్రాహ్మణునకు ఇవ్వవలెను. తిను బ్రాహ్మణుడు లేకున్న యెడల అగ్నియందు ఉంచవలెను. భోక్తల భోజన పాత్రలను తానుగాని, శిష్యుడుగాని,కుమారుడుగాని తీయవలెను. స్త్రీలచేతగాని, బాలురచేతగాని, ఇతర జాతులవారిచేతగాని తీయించరాదు. ఒకవేళ స్త్రీలు తీయవలసి వచ్చిన యెడల చీర మార్చుకుని తీయవలెను. భోజన పాత్రలు గోవునకు,బ్రాహ్మణునకు పెట్టరాదు,జలమందు ఉంచరాదు. వికిరమును పాత్రలను గోతులలో పూడ్చవలెను. తాతగారు జీవించియుండగా రెండు మాఖలు తండ్రిపేరు చెప్పి ఒకమాఖ ముత్తాతపేరు చెప్పవలెను. పిండములు రెండు తండ్రికి ఒకటి ముత్తాతకు ఇవ్వవలెను.

గృహమందు ముగ్గులును,మెడయందు మాలికను,లలాటమునందు తిలకమును చూచి పితరులు వెళ్లెదరు. కనుక శ్రాద్ధ కర్తకుగాని,భోక్తలకుగాని లలాటమునందు ఊర్ధ్వపుండ్రముగాని,త్రిపుండ్రముగాని ఉన్నయెడల పితరులు నిరాశులై వెళ్లుదురు. భోక్తకు గంధమును ఇచ్చు వరకు మృత్తికనుగాని,భస్మమునుగాని,చందనమునుగాని ధరించుటకు వీలులేదు. గంధదానము తరువాత గంధమును ధరించవచ్చు. కర్తకు శ్రాద్ధ సమాప్తి

పర్యంతము తిలకము గూడదు. ఇచట తిలకము అనగా గంధము మీద ఉంచబడు కుంకుమాక్షతాదులు.శ్రాద్ధదినమందు ప్రాతఃకాలమందు హోమము చేసి ఆ అగ్గినుండి కొంచెం అగ్నిని తీసి వంటశాలలో ఉంచి వృద్ధిపరచి అందు శ్రాద్ధపాకమును చేయవలెను.ఏ గృహమందు శ్రాద్ధపాకము చేయబడునో ఆ గృహము యొక్క ముంగిట పితరులు సంచరింతురు.అనగా అచటనే శ్రాద్ధమును జరుపవలెను.

సమష్టికుటుంబమందు జ్యేష్ఠుడు సమంత్రకముగా శ్రాద్ధము చేయవలెను. తమ్ములు అతని మాటమీద ఉండవలెను కాని వేరుగా చేయ నవసరము లేదు.తిథివారాదులను పఠించి పితరులకు తిలోదకము జ్యేష్ఠుని తో గూడి అనుజులు ఇవ్వవలెను. సమష్టిలో జ్యేష్ఠుడు దేశాంతరముకాని గ్రామాంతరముగాని వెళ్లినయెడల కనిష్ఠుడు శ్రాద్ధము చేయకూడదు.జ్యేష్ఠుని ఆజ్ఞమీద కనిష్ఠుడు శ్రాద్ధము పెట్టుచున్నయెడల మధ్యలో జ్యేష్ఠుడు వచ్చిన అప్పటికి మిగిలిన శ్రాద్ధమును జ్యేష్ఠుడు చేయవలెను.పిండదానము తరువాత వచ్చినయెడల పునశ్శ్రాద్ధమును జ్యేష్ఠుడు చేయవలెను.పిండదానమునకు ముందు జ్యేష్ఠునిచేత చేయబడు శ్రాద్ధమందు కనిష్ఠులు వచ్చిన పిండము లందు తిలోదకములను మాత్రము విడువవలెను.

భోజనకాలమందు కర్త కన్నీళ్ళు విడువకూడదు,నిందితమగు సంభాషణ కూడదు,భుజించుచున్న బ్రాహ్మణుల వంక చూడకూడదు. దీనుడుగాను మాత్సర్యము, క్రోధము ఇత్యాది గుణములు కలవాడయ్యి ఉండకూడదు.పరధ్యానముగా ఉండరాదు. స్థిరచిత్తుడై ఉండవలెను.భోక్త క్రోధాది దుష్టగుణములు లేనివాడుగాను ఇటు అటు దిక్కులు చూడకుండాను మౌనంగా ఉండవలెను.తనకు ఇష్టమైన పదార్థములను తృప్తియగు పర్యంతము భుజింపవలెను.పదార్థముల గుణదోషములను భోక్తలను అడుగరాదు.

పిండములను చేయుటయు,దర్భలను త్రుంచుటయు,భూఘర్షణ చేయుటయు రెండు హస్తములతోనే చేయవలెను.శ్రాద్ధము పెట్టిన పిమ్మట ఆదినమందు తప్పకుండా భుజింపవలయునుగాని ఏకాదశి మొదలగు

ఉపవాసదినమైనప్పటికి భోజనము మానరాదు. పదార్థము మిగలకపోయినను తిరిగి పాకము చేయించుకునైనను భుజింపవలెను. ఆదినమందు కర్త,భోక్త బ్రహ్మచర్య వ్రతముగా ఉండవలెను. రెండవసారి భుజించుట,మరో ఊరికి వెళ్లుట,మంచముమీద పరుండుట,భార్యతో సంభోగించుట,స్వాధ్యాయము పఠించుట,పోట్లాడుట,పగలు నిద్రించుట,ఇటువంటి ప్రవర్తనలు పనికిరావు. శ్రాద్ధ భోక్తలు సంధ్యావందనము,హోమము చేయరాదు,అయితే ప్రాయశ్చిత్తము కొరకు గాయత్రితో పది పర్యాయములు ఆచమనము చేసిన పిమ్మట సంధ్యావందనాగ్నిహోత్రాదులను చేయవచ్చును. నీళ్లుపోసి కలపకయే పెరుగును వాడరాదు.

ఆశౌచమధ్యమందు శ్రాద్ధదినము వచ్చినచో ఆశౌచము అంతమైన పదకొండవ దినమందు చేయవలెను. అది దాటినచో శుద్ధ మాసమందు చేయవలెను. అనగా మలమాసమైనచో చేయగూడదని అర్థము. ఇది మాసికమందు ప్రతివార్షికమందును తెలియవలెను. మాతామహుడు,మేనమామ, మేనల్లుడు,దౌహిత్రుడు,అల్లుడు,గురువు,స్వశిష్యులు,ఋత్వికులు, పురోహితుడు, మామగారు,బావమరిది వీరు భోక్తలుగా మధ్యమ స్థానమును అలంకరింతురు. వీరితోపాటు పినతల్లికొడుకులు,మేనత్తకొడుకులు, మేనమామకొడుకులు కూడా పనికివస్తారు.

ఒక బ్రాహ్మణుని భోక్తగా నియమించి తిరిగి కాదనరాదు. పొరపాటున ఒక భోక్తను చెప్పి అతనిని మరచి మరొకరిని నియమించినచో అతనిని క్షమాపణ కోరి దక్షిణ తాంబూలాదులతో తృప్తిపరచవలెను. ఈ పని బుద్ధిపూర్వకంగా చేసినచో చాంద్రాయణముచేసి ఆ పాపమునుండి విముక్తుడు కావలెను. రోగాదుల వల్ల కర్త శ్రాద్ధము చేయలేని అశక్తుడైనచో శిష్యునిచేతగాని ఇతరులచేతగాని చేయించవలెను,అపుడు ఆ శ్రాద్ధము చేయువారు కూడా ఆయా నియమాలను పాటించాలి.

పిండప్రదానము చేయకముందు స్త్రీలు గంధపుష్పాదులతో అలంకరించుకొనరాదు. స్త్రీలు గోచిపోసి చీరకట్టకపోయినను,తల విరయబోసికొన్నను,నవ్వుచున్నను మాట్లాడుచు పనిచేసినను పితరులు

నిరాశతో వెనుదిరిగి పోవుదురు. గంజి, పెరుగు, మజ్జిగ, కాచిన నెయ్యి, వెన్న శ్రాద్ధదినమున భోక్తలకు పెట్టకుండా ముందుగా ఎవరికిని పెట్టరాదు. కుతపకాలము దాటిన తరువాత ప్రారంభించి ఐదు ముహూర్తములలో శ్రాద్ధము పూర్తి చేయవలెను. (ఒక ముహూర్తము అనగా సుమారు 48ని॥ ఉండును)

పితృ, పితామహ, ప్రపితామహాదుల పేర్లు తెలియనిచో పృథివీసత్, అంతరిక్షసత్, దివిషత్ అను పేర్లతో వ్యవహరించవలెను. పురుషులకు 'ఈశ్వర' , స్త్రీకి 'అప్ప' శబ్దమును పేరు చివర చేర్చి చెప్పవలెను. స్త్రీలకు 'దా' అన్న అక్షరము పేరు చివర చెప్పవలెను. ఉదా॥ శేష+అప్ప+దా= శేషప్పదా అని అలాగే పురుషులకు రామ+ఈశ్వర+శర్మ=రామేశ్వరశర్మ అని చెప్పవలెను. తొలినాడు చెప్పిన భోక్తలనే శ్రాద్ధ ప్రారంభమున 'క్షణః కరణీయః' అని మరళ నిమంత్రణము చేయవలెను.

ఆశ్వలాయనులకు అన్న చతుర్భాగమును, పిండపరిషేచనమును, పిండ పాత్రాథోముఖమును చేయకూడదు. కర్త ఆహితాగ్ని ఐన దక్షిణాగ్ని యందు అగ్నౌకరణము చేయవలెను. ఆహితాగ్ని అనగా సర్వాధానము చేసినవాడు. ఆబ్దికాదులందు సర్వాధాని విప్రుని పాణియందు అగ్నౌకరణము చేయవలెను. ఆహితాగ్నికానిచో ఔపాసనాగ్నియందు చేయవలెను. అర్ధాధాని అనగా గృహ్యాగ్నిని మాత్రము ప్రతిష్ఠించుకొన్నవాడు, అనగా ఔపాసనను చేయువాడు అని అర్థము. స్వాహాకారముతో హోమము చేయునపుడు ఉపవీతిగానే ఉండవలెను. మేక్షణము అనగా హోమము చేసిన దర్భలు. అగ్నౌకరణ హోమమును కొందరు సవ్యముగాను కొందరు దక్షిణదిశగా తిరిగి అపసవ్యముగాను చేయుదురు. అనగ్నికులు అనగా అగ్నిహోత్రములేని వారు, భార్య చనిపోయిన విధురుడు, వివాహమున గృహ్యాగ్ని స్వీకారము చేయనివాడును, అగ్నికార్యముచేయు బ్రహ్మచారియైనను అనగ్నికులుగానే పరిగణింపబడుదురు. విప్రపాణియందు హోమమును విశ్వేదేవస్థానమున ఐనచో ఉపవీతిగాను, పితృస్థానమైనచో అపసవ్యముగాను చేయవలెను. ఈ రెండు పద్ధతులు కూడా ఉన్నవి.

బ్రహ్మచారి,విధురుడుగాని ఆబ్దికము పెట్టవలసి వచ్చినచో తాను తప్పుకొని సాగ్నికులైన సోదరులచే అగ్నౌకరణము జరిపించవలెను. సోదరులు కూడా నిరగ్నికులేయైన లౌకికాగ్నిలో అగ్నౌకరణము చేయవలెను.విప్రుడు అగ్నివంటి వాడు కనుక విప్రపాణియందు హోమము చేయవలెను.కాని చివర మేక్షణమును అగ్నిలో వేయనక్కరలేదు.

భోజనపాత్రలందు అభిఘారముచేసి ఉపవీతుడై దేవతలకు ముందు పితరులకు తరువాత వడ్డించవలెను.స్వయముగా వడ్డించినచో అనంత ఫలము కలుగును.భార్య వడ్డించినను ప్రశస్తమే అగును.

నేయి,అన్నము,కూరలు,పచ్చళ్లు గరిటతో వడ్డించవలెను.ఉదకము, పరమాన్నము గరిటతో వడ్డించరాదు.నేయిపోసిన పాత్రలను భోక్తల విస్తళ్లప్రక్కనే నేలమీద ఉంచవలెను.అన్నము ప్రక్కనే ఉన్నచో అది రక్తము వంటిదగును.పక్వముచేయని పండ్లు మున్నగువానిని,పిండివంటలను చేతితోనే వడ్డించవలెను.

భోక్తలకు విస్తళ్లుగా ఆకులువేయుటకు మోదుగ,ఇప్ప,మేడి,రావి,జువ్వి, టేకు,అరటి,తామర,మామిడి,పనస,నేరేడు,పున్నాగ,సంపెగ వంటి ఆకులు శ్రేష్ఠము.భోక్తలు తిని చేతులు కడుగుకున్న తరువాత ఒకసారి ఉత్తర ముఖముగాను,రెండవసారి ప్రాఙ్ముఖముగాను ఆచమనము చేయవలెను. భోక్త తిన్న తరువాత గిన్నెలలో మిగిలిన పదార్థములతో పిండములు చేయవలెను.వండిన అన్ని పదార్థములువేసి తిలలు కూడా కలిపి పిండము లనుచేసి దక్షిణముఖుడై భోక్తల విస్తళ్ల ప్రక్కనే పిండప్రదానము చేయవలెను.

ఉచ్ఛిష్ట పితృపాత్రలకు ఒక జానెడు దూరముగా కాకిపిడచను ఉంచవలెను. భోక్తల భోననానంతరముగాని,ఆచమనముచేయుటకు పూర్వమునందుగాని పరమందుగాని బ్రాహ్మణ విసర్జనానంతరముగాని పిండప్రదానము చేయవలెను.అన్నములో తేనె,నువ్వులు,నెయ్యి కలిపి అగ్నౌకరణములో మిగిలిన అన్నమును కూడా కలిపి మూడు పిండములను చేయవలెను.లేదా పదార్థములన్నింటితో పిండములు మూడు చేయవలెను. దక్షిణముఖముగా కూర్చుండి పిండపితృయజ్ఞం విధిగా చేయవలెను.

పిండములనుంచు ప్రదేశమున దర్భలను పరచి తిలోదకమునుంచి ఎడమ మోకాలును వంచి తదుక్తమగు మంత్రములతో మూడు పిండములను బొటనవ్రేలి ద్వారా బోర్లించి ఉంచవలెను. పిండోద్వాసమైన పిమ్మట బ్రాహ్మణుల హస్తమందు దర్భాక్షతలను అక్షయోదకమును ఇవ్వవలెను. నీళ్లలోదిగి దక్షిణముఖముగా నుండి పిండములను ఆకాశము మీదికి పైగా ఎగకవేసి జలములో విడిచి పెట్టవలయునని చెప్పిరి. బ్రాహ్మణ విసర్జనకు పూర్వమే ఉచ్ఛిష్ట పాత్రలను తీయవలెను. పితృస్థానములందు ఒక్క విప్రుడు ఐనచో 'ఇదంవః' అని,ఇద్దరు ముగ్గురు ఐనచో 'ఇదంతే' అని తెలియవలెను. యజ్ఞ వస్తువులందును,పీటలమీద దర్భలు వేయునపుడు,భోక్తల ఆసనము లకును దర్భలు ఇన్ని అనే నియమము లేదు. కర్త సాయం సంధ్య వార్చవలెను. పితరుల శ్రాద్ధమున మూలలతో ఉన్న దర్భలు పెట్టినచో పితరులు స్వర్గమున సుఖింతురు. పితరుల తర్పణాది కార్యములలో రెండు దర్భల పవిత్రములు లేదా ఏడు దర్భల పవిత్రములు ఉండవలెను. రెండు కణపుల మధ్య ధరించ వలెను. రెండు చేతులకు ధరించవలెను. పవిత్రములు చేయలేనిచో రెండేసి దర్భలను అనామికలకు రెండు చేతులకును ధరించవలెను.

ప్రేత క్రియలకును,పితృకార్యములకును,అభిచారమునకును దర్భలు కోయునపుడు ప్రాచీనావీతిగా ఉంచవలెను. దక్షిణాభి ముఖుడై కోయవలెను. దారిలో మొలిచిన దర్భలను,చితిలోని దర్భలను,యజ్ఞభూమిలో గల దర్భలను,బ్రహ్మయజ్ఞమున వాడినవి,మలమూత్ర స్పర్శతగిలిన వానిని విసర్జింపవలెను. ఇతర పవిత్రములెన్ని ఐనను బంగారముతో చేసిన పవిత్రమునకు సాటిరావు. వడ్డీరూపములో వచ్చిన ద్రవ్యము,కన్యను అమ్మి తెచ్చిన డబ్బు,అన్యాయముగా సంపాదించిన డబ్బు,తండ్రి ఆబ్దికమని యాచించి తెచ్చినది శ్రాద్ధమునకు పనికిరాదు.

రెండుసార్లు వండిన అనగా జీలకర్ర ఇంగువ మొదలైన వానితో పోపులో వేసి వ్రుగ్గించిన పదార్థములు పనికిరావని చెప్పినను కాకరకాయ వంటి చేదు పదార్థములలో బెల్లము కలిపి పోపు పెట్టక పోయినచో తినలేము కనుక కొన్నింటికి మాత్రము రెండుసార్లు వండినను దోషము లేదు.

శ్రాద్ధము మొదట చివరలలో రెండు ఆచమనాలు అనగా మొదట రెండు ఆచమనాలు,విప్రుల పాదప్రక్షాళన అనంతరము రెండు,అర్చన సమయమున ఒకటి,వికిర సమయమున ఒకటి,పిండములను అర్చించునపుడు ఒకటి, బ్రాహ్మణులను విసర్జించినపుడు రెండుసార్లు ఆచమనము చేయవలెను. పాదప్రక్షాళన చేయునపుడు విప్రులను పీటవేసి కూర్చుండ పెట్టవలెను, లేనిచో పితరులు నిరాశతో వెళ్లిపోవుదురని శాస్త్ర వచనము.కర్త పడమటి దిక్కునకు తిరిగి ఉండి పాద ప్రక్షాళన చేయవలెను.పాద ప్రక్షాళనము కాగానే మండలములకు ఉత్తరమున కూర్చుండి కర్త ద్విరాచమనము చేయవలెను,తదుపరి భోక్తలు కూడా ద్విరాచమనము చేయవలెను.

తామరాకు,పాలకర్ర,నేరేడు,మామిడి,కమిడి,పొగడ కర్రలతో చేసిన పీటలపై భోక్తలను కూర్చో పెట్టవలెను.పీటలమీద దర్భాసనమును వేసి భోక్తలను కూర్చుండ పెట్టవలెను.తిలలు అసురులనుండి,దర్భలు రాక్షసులనుండి రక్షించును.పంక్తిని శ్రోతియుడు,అతిథి సర్వమును రక్షించును.భోక్తకు వస్త్రము ఇవ్వలేనపుడు పట్టుదారము ఇవ్వవలెను.శక్తి ఉన్నచో పట్టువస్త్రము, నూలువస్త్రము ఇవ్వవచ్చును.నారబట్ట కూడా ఇవ్వవచ్చును.వస్త్రములు ఇవ్వలేనిచో యజ్ఞోపవీతము ఇవ్వవలెను.వస్త్రములు ఇవ్వలేనపుడు వాని వెలకు సరిపడు ధనము ఇవ్వవలెను.అంచులు లేనివి ఇవ్వరాదు.తడపనివి ఐన వస్త్రములను ఇవ్వరాదు.వస్త్రములతో పాటు యజ్ఞోపవీతమును ఇవ్వవలెను.

భోక్తలు భుజించుచుండగా మూడు పర్యాయములు గాయత్రిని,రక్షోఘ్న మంత్రములను,పురుషసూక్తమును,అప్రతిర్థ సూక్తమును జపించవలెను. ఇంద్రసూక్తమును కూడా చెప్పవలెను.బ్రహ్మ,విష్ణు,సూర్య,రుద్రస్తోత్రములను-ఇంద్ర,ఈశ,సోమ,పవమాన సూక్తములను చెప్పవలెను.ఇవి చెప్పుటకు సాధ్యముకానిచో సర్వవిద్యాశిరోభూషణమైన గాయత్రిని యథాశక్తిగా జపించవలెను.వీణావేణు ధ్వనులు భోక్తలకు వినిపించవలెను.నాచికేత త్రయమును,త్రిమధువులను,త్రిసుపర్ణములను చెప్పవలెను.

తులసి పత్రమును,రక్త పుష్పములు,మొగలి పువ్వులు,మొగలి ఆకుల పాత్రలు వీటిని చూడగానే పితరులు నిరాశులై వెళ్లుదురు. జాజిపువ్వు,ఎఱ్ఱ పద్మము, మారెడు,జిల్లేడు,ఉమ్మెత్త,దేవదారు,అడ్డసరము మొదలయిన పుష్పాలు, విశేష గంధముగల పువ్వులు,వాసనలేని పువ్వులు,మెట్ట ప్రదేశమందు పుట్టిన ఎఱ్ఱని పువ్వులు,ముండ్ల చెట్లయందుగల పువ్వులు పనికిరావు. తెల్లని పద్మములు, కలువ పువ్వులు,సువాసనగల మల్లి,తెల్ల గురివింద,చంపకము,నీటిలో పుట్టిన సమస్త పుష్పములు ఉపయోగించ వచ్చును. జాజి,సంపెంగ,లొద్దుగ,మల్లి,నల్లగోరంట,వాయింట, మామిడి, అశోకము,అడ్డసరము,తులసి పత్రము ఈ పుష్పపత్రములు ప్రశస్తములు.

ఆకులతోను, కొయ్యలతోను, తామరపూలతోను, శంఖములతోను అర్ఘ్యపాత్రములు ఏర్పరచవలెను. బంగారము,వెండి,రాగి,శిల,స్ఫటికము, శంఖము, ముత్యపుచిప్ప వీటితో చేసిన పాత్రలు కొంచెము చితికినను వాడవచ్చును. మట్టిపాత్ర,కంచుది,చర్మముతో చేయబడినది,ఇత్తడిది,సీసపుది, ఇనుపపాత్ర ఇట్టివి అర్ఘ్యపాత్రలుగా పనికిరావు. అర్ఘ్యపాత్రలు మట్టితోకూడా చేయవచ్చును,అయితే అవి స్వహస్తములతో మాత్రమే చేయవలెను. మట్టిపాత్రలు కుమ్మరిచేసినవి వాడరాదు. అవి అసురములు. భోక్తలు భుజించునంత వరకు పితృగాథలు, వేదములు,ధర్మశాస్త్రములు, పురాణములు మొదలగునవి వినిపించవలెను. ఆశ్వలాయనులు ఆబ్దికములందు వారి బంధుత్వము, నామమును,గోత్రమును,రూపమును చెప్పవలెను. ప్రేతకర్మలయందు అనగా మాసికములందు వారి బంధుత్వము, గోత్రము,నామము,రూపమును చెప్పవలెను.

ఘంటానాదమును,కలహమును,హుంకారమును,హాస్యమును,రోద మును,అవాచ్యవచనములను వినినమాత్రముననే పితరులు నిరాశులై వెళ్లెదరు. గుఱ్ఱము సన్నిధిలో ఉండుట,నత్తగుల్ల లేదా ఆల్చిప్ప,ఉమ్మెత్త,జాజి, జిల్లేడు, గన్నేరు పువ్వులు శ్రాద్ధమును పాడుచేయును.

శ్రాద్ధమునందు మొదలుతో సహా ఉండు దర్భలు,బియ్యము,తిలలు, పరిశుద్ధి చేసిన వెండి,కంచు,రాగి మొదలగు లోహపాత్రలు,సమిధలు,నెయ్యి,

తేనె,పుష్పములు,ధూపద్రవ్యము,క్షౌమసూత్రము,మేక్షణము,బ్రాహ్మణులు కూర్చోవడానికి బ్రుసి అను (నేపాళ దేశములో మేకల రోమములతో నేయబడినది) ఆసనము అనగా నేపాళకంబళి అవసరము. విశ్వేదేవ,పితృస్థానములందు రెండు చోట్లను పలాశపత్రపాత్రములనే భోజనమునకు ఉంచవలెను. గుగ్గిలము,సాంబ్రాణి,ఉశీరము,వట్టివేళ్లు,చందనాగరు మొదలగునవి ధూపమునకు ఉపయోగించవచ్చు. కస్తూరి అగరు,కుంకుమ,చందనము మొదలైనవి గంధముగా ఉపయోగించి విలేపనద్రవ్యము గ్రహించవలెను.

దీపము నిమిత్తము నూనె,నెయ్యి వాడవలెను. బంగారం,వెండి,రాగి వీటిచే చేయబడిన ఆసనము,చిత్రాసనము,కర్రపీట,గడ్డిచాప,దర్భాసనములు ప్రశస్తములు. కర్రపీటలో నేరేడు,కడిమి,మామిడి,పగడ,జమ్మి,యిరుగుడు ఈ చెట్ల బల్లలచే చేసిన పీటలు ప్రశస్తములు.

దోసకాయ,అరటికాయ,చిక్కుడుకాయ,పొట్లకాయ,బీరకాయ,కాకరకాయ మొదలగు కాయగూరలలో కొన్నియు,మెంతులు,జీలకర్ర మొదలగు దినుసులు శ్రాద్ధమందు ఉపయోగించవచ్చును. సైంధవ లవణము శ్రేష్ఠము. క్షీరములు,దధి,తైలము,తేనె,బెల్లము,పంచధార,మామిడి పండ్లు,పనస పండ్లు, ద్రాక్ష పండ్లు,ఖర్జూర ఫలములు ఇత్యాది ఫలములు ఉపయోగింపవచ్చును. గోధుమలు,మినుము, పెసరపప్పు,నూనె పిండి వంటలు కచ్చితంగా శ్రాద్ధములో ఉండవలెను. చామలు,ఆవనూనెలు వాడవచ్చును. అరటి పండ్లను,దుంపలను,అల్లమును భోక్తలకు పెట్టవచ్చును. రేగు,ద్రాక్ష,లవంగ, ఏలకులు,పిప్పిలి,శొంటి,శర్కరాది వస్తువులను పెట్టవలెను. మీగడ తీయని పెరుగు పనికి వచ్చును. కలిగొట్టు ఆకుకూర,చిట్టి కూర,వాస్తుకము,ముల్లంగి దుంప,ఆరణ్యకము ఇవి శ్రాద్ధమున తప్పక ఉండవలెను. దానిమ్మ,పిప్పిలి, చింతపండు,అంబాళము(ఆమ్రాంతకము),కొత్తిమీర కూడా ఆయా పదార్థముల లో వాడవచ్చును. అవిసెచిగుళ్ళు కూడా వాడవచ్చును. పిప్పిళ్ళు,మిరియాలు సముద్రపు ఉప్పు మొదలైనవి విడిగా పెట్టక పదార్థములలో రుచికై కలిపిన దోషములేదు.

వావిలి,పాలకూర,తులసి,మసురలు,గుమ్మడి,కందులు,పెద్ద ఆవాలు,

వెఖుతురు పూలు,కాయలు,వాయు విడంగము,మిరియములు,నిమ్మకాయ, మాదీఫలము,నేరేడు,ఆనపకాయ,పిప్పిళ్లు,చేదుపొట్ల,జొన్నలు,ఉలవలు పనికిరావు. వంకాయలు,ఉల్లిపాయలు,సొరకాయ,నేతిబీరకాయ,ములగ కాయ,గోంగూర,బచ్చలికూర పనికిరావు.రెండు పర్యాయములు చేయబడిన పదార్థములు పనికిరావు. చోళ్లు,కొఱ్ఱలు,బొబ్బర్లు,ఉలవలు పనికిరావు.

భోక్త ముక్కుచు మూలుగుచుగాని,చేతి సంజ్ఞలతోగాని పదార్థముల రుచులు చెప్పరాదు. భోజనపాత్రను పైకెత్తి దింపరాదు. కాళ్ళు ముందుకుకనిపించునట్లు కూర్చుండరాదు. గోచి ఊడిపోరాదు.బ్రొటనవ్రేలు ఉపయోగించకుండ మిగిలిన నాలుగు వ్రేళ్ళతో తినరాదు. నోటితో చప్పుడు చేయుచు తినరాదు.త్రాగగా మిగిలిన నీళ్ళను తిరిగి త్రాగరాదు అనగా పెద్దచెంబులోని నీళ్లు చిన్నగ్లాసులో పోసుకొని పూర్తిగా త్రాగి తిరిగి గ్లాసు నింపుకిని త్రాగవలెను. పిండివంటలుగాని,ఫలములుగాని కొరికి తిని మరళ ఆ ఎంగిలి తినరాదు. అన్నము మూతికి అంటించుకొనరాదు. భోజనపాత్రలో ఉమ్మి వేయరాదు. పక్కవానికి పెట్టుమని కూడా అడుగరాదు. చేతులెత్తి నవ్వరాదు, అత్యాశ్చర్యము ప్రకటించరాదు. వంకరగా కూర్చొనరాదు. తినుచు తినుచు మధ్యలో ఎడమ చేతితో అన్నమును తాకరాదు. కాళ్లమీద, నెత్తిమీద,పొత్తికడుపు మీద పోసికొనరాదు. భోజనపాత్రను కాళ్లతో తాకరాదు. పెరుగుతోను, పాలతోను,తేనెతోను కూడిన అన్నమును విడిచి పెట్టరాదు, అయితే విస్తరిలో అన్నమును పూర్తిగా తినివేయరాదు కొంచెము మిగల్చవలెను. భోక్త భుజించుచు కన్నీళ్లు పెట్టరాదు. వ్యర్థమైన మాట లాడరాదు. పక్కను తినుచున్న వారివైపు చూడరాదు. వారి తిండిని చూచి ఈర్ష్యపడరాదు. భోక్తలు చేయికడుగుకొన్న తరువాత మంచినీళ్లు త్రాగరాదు,ముందే త్రాగవలెను.

కత్తిపీట,గరిట మొదలగు పాకసాధనములు తప్ప ఇతరమైన కత్తులు ఇనుపపాత్రలు మొదలగువి శ్రాద్ధభూమినందు చూచుటకు పనికిరాదు. తేనె లేకుండ శ్రాద్ధములో ఎన్ని పదార్థములు పెట్టినను పితృదేవతలకు తృప్తి కలుగదు. పసుపుతో కలిపిన అక్షతలు శ్రాద్ధమందు వాడరాదు.

భోక్తలు తినుచుండగా రుద్రమును,రక్షోఘ్న మంత్రాలు చెప్పవలెను. ఉదీరతాం,అధ్వన్నవతీః,అన్నవత్యః,పితున్నుస్తోషం వంటి మంత్రాలు చెప్పవలెను. భోక్త వాంతిచేసినచో మాసికములందు ఆబ్ధికములందును సమయమున్నచో పునఃపాకము చేసి శ్రాద్ధము పెట్టవలెను. లేదా కర్త ఆనాడు ఉపవాసము చేసి మరునాడు జరుపవలెను. విశ్వేదేవ బ్రాహ్మణుడు వాంతి చేసుకొన్నచో అగ్నిలో హోమము తప్ప తిరిగి శ్రాద్ధము అక్కరలేదు. పితృబ్రాహ్మణులు వాంతి చూసుకున్నచో తిరిగి మరునాడు శ్రాద్ధము జరుపవలెను. వికిరదానము కూడా పిండప్రదానము వలె ప్రధానమైనది. యజమానుల దాసదాసీజనుల ఉద్దేశించి పితృస్థాన ద్విజుడు విస్తరి నుండి కొంత అన్నము భూమిపై విడువవలెను. చేతులు కడుగుకున్న తరువాత భోక్తలు ఒకసారి ఉత్తర ముఖముగాను రెండవసారి ప్రాఙ్ముఖము గాను ఆచమనము చేమవలెను. భోక్తల విస్తళ్లకు బారెడు దూరంలో పిండప్రదానము చేయవలెను. అంత వైశాల్యము లేనపుడు మూరడు దూరములో చేయవచ్చును. పిండప్రదానము దర్భలపైగాని,రెల్లపైగాని, పెద్ద గరికపరకలపైగాని చేయవలెను. 'అపహతా' మంత్రంతో అలికి మీద దర్భలు పరచి ప్రాచీనావీతిగా ఉదకముతో మూడు రేఖలు వేసి 'శుంధంతాం పితః' అని తరువాత తిరుగవేసిన చేతితో పిండములు పెట్టవలెను.

తిలలతోను,అన్నముతోను,పానీయముతోను,ధూపముతోను,దీపముతోను, పాలతోను,తేనెతోను,నేయితోను,కలకండ (పటిక బెల్లము)తోను మిశ్రమము చేసిన పిండములను అష్టాంగ పిండము అందురు. పితరులను ఉద్దేశించి అట్టి పిండాలు పెట్టవలెను. వండిన అన్ని పదార్థములను వేసి తిలలు కూడా కలిపి పిండములను చేసి దక్షిణముఖుడై భోక్తల విస్తళ్లు ప్రక్కనే పిండ ప్రదానము చేయవలెను. మిగలకపోయినచో వేరే పిండితోనైన పిండములు చేసి పెట్టవలెను. సపిండీకరణములో మాత్రము భుక్తశేషముతోనే పిండములు పెట్టవలెను. సపిండీకరణములో 12 అంగుళముల పొడవు ఉన్న పిండము ఒకటియు తక్కిన మూడును వెలగకాయలంతయు ఉండవలెను. ఆబ్ధికముల లో ఒలిచిన కొబ్బరికాయంత లేదా మారేడుకాయంతగాని పిండములు

ఉండవలెను. మహాలయములలోను,గయాశ్రాద్ధములోను ఉసిరికాయలంత పిండములు – తీర్థవిధులందును,దర్శశ్రాద్ధములందును కోడిగుడ్లంత పిండమును చేయవలెను. గయయందు జమ్మి ఆకులంత (శమీపత్ర ప్రమాణేన) పిండము పెట్టవలెను. టెన్నిస్ బంతంత పిండముచేయుట ఆచారముగా కొనసాగుచున్నది. భోక్తలకు నమస్కారము చివరలో చేయునపుడు సకుటుంబముగా ప్రదక్షిణ నమస్కారములు చేయవలెను. ముందు చిన్న వాళ్లు చివరకు పెద్దవాళ్లు ఉండవలెను.

భోగములను కోరువాడు పిండములను అగ్నిలో వేయవలెను. సంతానము కోరువారు మధ్యమ పిండమును భార్యకు పెట్టవలెను. భార్యకు ఇచ్చునపుడు 'వీరంమేధత్త' మంత్రము,తినునపుడు 'అపాంత్వౌషధీనాం రసం ప్రాశయామి భూతకృతం గర్భం ధత్స్వ' అను మంత్రమును చెప్పవలెను. ఉత్తమగతి కోరువాడు గోవునకు పెట్టవలెను. ఆజ్ఞను,కీర్తిని,ప్రజ్ఞను కోరువారు శుద్ధమైన జలములో వేయవలెను. పిండములను గోవులకు,మేకలకు, విప్రులకు పెట్టవచ్చును. తీర్థశ్రాద్ధములందు పిండములను ఆయా తీర్థము లందు మాత్రమే వేయవలెను.

పితృశేషమును శూద్రులకు పెట్టరాదు. కొడుకులకు,శిష్యులకు పెట్టవలెను. వృద్ధిశ్రాద్ధమున,సపిండీకరణమున,ప్రేతశ్రాద్ధమున(సంవత్సరములోపున జరుపు మాసికములు),సంవత్సర విమోకమునందును తదంగముగా తిల తర్పణము చేయరాదు. భోక్తలు తిన్న విస్తళ్లు సాయంత్రము వరకు తీయకుండా ఉంచినచో వానినాశించిన వారికి అవి అమృతధారలు కురిపించును,అవకాశమున్నచో అట్లే ఉంచుట మంచిది. లేనిచో బ్రాహ్మణుల ను పంపువరకైనను ఉంచవలెను.

కర్త తన పొట్టకు ఎడమవైపున లేదా కుడివైపునగల పార్శ్వ భాగమునందు తిలలతో మూడు దర్భలు,పైబట్టచెంగున కట్టి మొలకు సరిపడు మిగిలిన వస్త్రభాగము చుట్టవలెను. ఈ విధముగా చేయునపుడు 'నిహన్మి సర్వం యదమేధ్య వర్భవేత్' అను శ్లోకమును పఠిస్తూ బిగించవలెను.

# దైవప్రార్థన

ఓం శ్రీగురుభ్యోనమః ॥ హరిః ఓమ్ ॥

*గణానామిత్యస్య శౌనకో గృత్సమదో గణపతిర్జగతీ ॥*

గణానాంత్వా గణపతిం హవామహే కవింకవీనా ముపమశ్ర వస్తమమ్।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥

*నిషుసీదేత్యస్య వైరూపో నభః ప్రభేదన గణపతి స్త్రిష్టుప్ ॥*

నిషుసీద గణపతే గణేషు త్వామాహుర్విప్రతమం కవీనామ్।
నఋతేత్వత్క్రియతే కించనారే మహామర్కంమఘవం చిత్రమర్చ॥
శ్రీ మహాగణాధిపతయే నమః ॥

*ప్రణోదేవీత్యస్య బార్హస్పత్యో భరద్వాజ సరస్వతీ గాయత్రీ ॥*

ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ ।ధీనామవిత్ర్యవతు ॥
శ్రీ మహాసరస్వత్యై నమః ।శ్రీవాగ్దేవ్యై నమః ॥

*శతధారమిత్యస్య గాథినో విశ్వామిత్ర ఉపాధ్యాయ స్త్రిష్టుప్ ॥*

శతధారముత్స మక్షీయమాణం విపశ్చితం పితరం వక్త్వానామ్।
మేళింమదన్తం పిత్రోరుపస్థే తంరోదసీ పిపృతం సత్యవాచమ్॥
శ్రీ గురుభ్యో నమః ॥

*ఋచో అక్షర యిత్యస్య ఔచథ్యో దీర్ఘతమా విశ్వేదేవా త్రిష్టుప్ ॥*

ఋచో అక్షరే పరమేవ్యోమన్యస్మిన్దేవా అధివిశ్వే నిషేదుః।
యస్తన్నవేద కిమృచాకరిష్యతి య ఇత్తద్విదు స్త ఇమే సమాసతే॥
హరిః ఓమ్ ॥

## జ్యోతిప్రజ్వలనం

భో! దీప బ్రహ్మరూపేణ సర్వేషాం హృదిసంస్థితః ।
అతస్త్వాం స్థాపయామ్యద్య మదజ్ఞాన మపాకురు ॥

*అగ్నినాగ్నిరిత్యస్య కాణ్వోమేధాతిథి రగ్నిర్గాయత్రీ।జ్యోతిప్రజ్వలనే వినియోగః॥*

అగ్నినాగ్నిస్సమిధ్యతే కవిర్గృహపతిర్యువా।హవ్యవాడ్జుహ్వాస్యః॥

దీపదేవతాభ్యాం నమః ॥(తూర్పు ఒక దీపం,దక్షిణం ఒక దీపం పెట్టాలి)

**ద్విరాచమ్య॥**

ఓం కేశవాయ స్వాహా।ఓం నారాయణాయ స్వాహా।ఓం మాధవాయ స్వాహా।ఓం గోవిందాయ నమః॥విష్ణో,మధుసూదన,త్రివిక్రమ,వామన,శ్రీధర,హృశీకేశ,పద్మనాభ,దామోదరాయనమః॥ సంకర్షణ,వాసుదేవ,ప్రద్యుమ్న,అనిరుద్ధ,పురుషోత్తమ,అధోక్షజ,నారసింహ,అచ్యుత,జనార్దన, ఉపేంద్ర,హరయే,శ్రీకృష్ణాయ నమః॥

*పవిత్ర ఇతి ద్వయోః ఆంగీరసః పవమానస్సోమో జగత్యౌ।పవిత్రధారణే వినియోగః।*

పవిత్రవన్తః పరివాచమాసతే పితైషాంప్రత్నో అభిరక్షతివ్రతమ్।
మహస్సముద్రం వరుణస్తిరోదధే ధీరాఇచ్ఛేకుర్ధరుణేష్వారభమ్॥
పవిత్రంతే వితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః।
అతప్తతనూర్నతదామో అశ్నుతే శృతాస ఇద్వహన్తస్తత్సమాశత॥ [1]

పవిత్రం ధృత్వా ॥ఆచమ్య॥ [2]కేశవాయ..........శ్రీకృష్ణాయనమః॥

---

1.రెండు దర్భలతో గ్రంథియుత పవిత్రాన్ని నిర్మించాలి. 2.గ్రంథియుత పవిత్రంతో ఆచమనం చేయరాదు కనుక,పవిత్రం తీసి కుడిచెవికి తగిలించి,రెండు దర్భలను ఉంగరం వేలికి ధరించి ఆచమించి, పిదప వాటిని విసర్జించి,చెవినున్న గ్రంథియుత పవిత్రాన్ని ధరించవలెను.

అపసర్పంతు తే భూతా యే భూతా భూమిసంస్థితాః ।
యే భూతా విఘ్నకర్తార స్తేనశ్యన్తు శివాజ్ఞయా ॥
*గయేయం గయేయం గయేయం॥*
దేవతాభ్యః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవచ।
నమస్స్వధాయై స్వాహాయై నిత్యమేవ నమోనమః॥
ఈశానః పితృరూపేణ మహాదేవో మహేశ్వరః।
ప్రీయతాం భగవానీశః పరమాత్మా సదాశివః॥ విష్ణుర్విష్ణుర్విష్ణుః ॥
*పృథివ్యాః మేరుపృష్ఠ ఋషిః।కూర్మోదేవతా।సుతలం ఛందః॥*
*ఆసనే వినియోగః ॥*
పృథ్వీత్వయా ధృతాలోకా దేవిత్వం విష్ణునా ధృతా ।
త్వంచ ధారయ మాందేవి పవిత్రం కురుచాసనమ్ ॥గదాధరాయ నమః॥
అనంతాసనాయ నమః॥

ప్రణవస్య పరబ్రహ్మ ఋషిః।పరమాత్మా దేవతా।దైవీ గాయత్రీ ఛందః।భూరాది సప్తానాం వ్యాహృతీనాం।విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ గౌతమాత్రి వసిష్ఠ కశ్యపా ఋషయః।అగ్ని వాయ్వాదిత్య బృహస్పతి వరుణేంద్ర విశ్వేదేవా దేవతాః।గాయత్ర్యుష్ణిగనుష్టుబ్బృహతీ పంక్తి త్రిష్టుబ్జగత్యశ్ఛందాంసి।గాయత్ర్యా విశ్వామిత్ర ఋషిః।సవితా దేవతా।గాయత్రీ ఛందః।గాయత్రీ శిరసః।ప్రజాపతిర్ఋషిః।బ్రహ్మాగ్ని వాయ్వాదిత్యా దేవతాః।యజుశ్ఛందః।ప్రాణాయామే వినియోగః॥

ఓం భూః।ఓం భువః।ఓం స్వః।ఓం మహః।ఓం జనః।ఓం తపః।ఓం సత్యం॥ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి।ధియోయోనః ప్రచోదయాత్॥ఓమాపో జ్యోతీరసో2మృతం బ్రహ్మ భూర్భువస్స్వరోమ్॥(ఏవంత్రిః)

తిథిర్విష్ణు స్తథావారో నక్షత్రం విష్ణురేవచ।
యోగశ్చ కరణం చైవ సర్వం విష్ణుమయం జగత్॥శ్రీగోవింద గోవింద॥

మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా, శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోర్దక్షిణదిగ్భాగే గంగా గోదావర్యో ర్మధ్యదేశే శ్రీకూర్మక్షేత్రే జయంతిక్షేత్రేచ ప్రాక్తటే సాలగ్రామ బ్రాహ్మణ హరివిశ్వేశ్వర సమస్తదేవతా బ్రాహ్మణ హరి గురుచరణ సన్నిధౌ స్వగృహే/అన్యగృహే/నివాసగృహే అస్మిన్వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన ....... నామసంవత్సరే ........ ఆయనే ....... ఋతౌ ..... మాసే ........ పక్షే ........ పుణ్యతిథౌ ....... వాసర సంయుక్తానాం శ్రీవిష్ణునక్షత్రే శ్రీవిష్ణుయోగే శ్రీవిష్ణుకరణ యేవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ। **(ప్రాచీనావీతి)** అస్మత్ *పితుః / మాతుః* ప్రతిసాంవత్సరిక మృతాహాఖ్యాన్న శ్రాద్ధం **(సవ్యం)** కరిష్యే॥కురుష్వ॥ ఆదౌ ఆత్మశుద్ధ్యర్థం భోక్తృ గృహ భూ భాండ ద్రవ్య స్థలశుద్ధ్యర్థం ప్రాయశ్చిత్తార్థం కలశార్చన పురస్సరంచ ప్రాయశ్చిత్తాది సూక్త మంత్ర జపం కరిష్యే॥తదంగ కలశార్చనం కరిష్యే॥

స్యోనాపృథివి భవానృక్షరా నివేశనీ।యచ్ఛానశ్శర్మ సప్రథః॥
*భూమిం ప్రార్థ్య॥*

గన్ధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్।
ఈశ్వరీం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్॥
*గోమయార్థం గంధానులేపనం కృత్వా॥*

ఇదంతే పాత్రం సనవిత్తమిన్ద్ర పిబా సోమమేనా శతక్రతో।
పూర్ణ ఆహావో మదిరస్య మధ్వోయం విశ్వ ఇదభిహర్యన్తి దేవాః॥
*కలశం నిక్షిప్య॥*
ఆకలశేషుధావతి పవిత్రేపరిషిచ్యతే।ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే॥
*కలశమభిమంత్ర్య॥*
ఇమంమే గంగే యమునే సరస్వతి శుతుద్రిస్తోమం సచతాపరుష్ణ్యా।
అసిక్న్యామరుద్వృధే వితస్తయా22ర్జీకీయే శృణుహ్యా సుషోమయా॥
*ఉదకమాపూర్య॥*
గన్ధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్।
ఈశ్వరీం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్॥
*గోమయార్ద్రం గంధం నిక్షిప్య॥*
యవో2సిధాన్యరాజోవా వారుణో మధుసంయుతః।
నిర్ణోదస్సర్వపాపానాం పవిత్రమృషిభి స్మృతమ్॥
*యవాన్ నిక్షిప్య॥*
**(ప్రాచీనావీతి)** తిలో2సిసోమదేవత్యో గోసవో దేవనిర్మితః।ప్రత్నవద్భిః
ప్రత్తస్స్వధయా పితౄనిమాఀల్లోకాన్ప్రీణయాహిన స్స్వధానమః॥
*తిలాన్ నిక్షిప్య॥*
**(సవ్యం)**శరాసః కుశరాసో దర్భాసస్సైర్యా ఉత।
మౌఞ్జా అదృష్టా బైరిణాస్సర్వేసాకం న్యలిప్సత॥
*కూర్చం నిక్షిప్య॥ తూష్ణీం దర్భగ్రంథిం నిక్షిప్య॥*

సహిరత్నాని దాశుషే సువాతి సవితా భగః।తంభాగం చిత్రమీమహే॥
*హిరణ్యం నిక్షిప్య॥*

**_పురుషసూక్తం, అస్యవామీయం, మమాగ్నే, సౌమ్య, వైష్ణవ, రుద్ర, పావమాన్యములు ఇక్కడ పఠించ వచ్చును._**

**కలశమభిమంత్ర్య।ప్రాయశ్చిత్త సూక్తం పఠిష్యే॥**
నతమంహో నదురితం దేవాసో అష్టమర్త్యమ్।
సజోషసో యమర్యమా మిత్రోనయన్తి వరుణో అతిద్విషః॥
తద్ధివయం వృణీమహే వరుణమిత్రార్యమన్।
యేనా నిరంహసో యూయంపాథనేథాచ మర్త్యమతిద్విషః॥
తేనూనంనో2య మూతయే వరుణోమిత్రో అర్యమా।
నయిష్ఠా ఉనోనేషణి పర్షిష్ఠా ఉనఃపర్షణ్యతిద్విషః॥
యూయం విశ్వం పరిపాథ వరుణోమిత్రో అర్యమా।
యుష్మాకం శర్మణిప్రియేస్యామ సుప్రణీతయో2తిద్విషః॥
ఆదిత్యాసో అతిస్రిధో వరుణోమిత్రో అర్యమా।
ఉగ్రం మరుద్భిరుద్రం హువేమేన్ద్రమగ్నిం స్వస్తయే2తిద్విషః।
నేతార ఊషుణస్తిరో వరుణోమిత్రో అర్యమా।
అతివిశ్వాని దురితా రాజానశ్చర్షణీనా మతిద్విషః॥

శునమస్మభ్యమూతయే వరుణోమిత్రో అర్యమా।
శర్మయచ్ఛన్తు సప్రథ ఆదిత్యాసో యదీమహే అతిద్విషః॥
యథా హత్యద్వసవో గౌర్యం చిత్పదిషితా మముంచతాయజత్రాః।
ఏవోష్వగస్మన్ముంచతా వ్యంహః ప్రతార్యగ్నే ప్రతరంన ఆయుః॥
అంహోముచమాఙ్గిరసంగయంచ స్వస్త్యాత్రేయం మనసాచ తార్క్ష్యమ్।
ప్రయతపాణిశ్శరణం ప్రపద్యే స్వస్తిసంబాధేష్వభయంనో అస్తు॥

**అథ శరీర శుద్ధ్యర్థం ఆత్మానం స్పృష్ట్వా॥ (కర్త హృదయాన్ని తాకాలి)**

శారీరమంతః కరణోపఘాతం వాచశ్చ విష్ణుర్భగవానశేషః।
శమం నయత్వస్తు మమేహశర్మ పాపాదనంతే హృది సన్నివిష్టే॥
అంతశ్శుద్ధిం బహిశ్శుద్ధిం శుద్ధోధర్మమయోచితః।
సకరోత్వమలే తస్మిన్ శుచిరేవాస్మి సర్వదా॥
బాహ్యోపఘాతా ననఘో బౌద్ధాంశ్చ భగవానజః।
శమం నయత్వనంతాత్మా విష్ణుశ్చేతసి సంస్థితః॥
శారీరంమే హృషీకేశ పుండరీకాక్ష మానసమ్।
పాపం ప్రశమయాద్య త్వం వాకృతం మమ మాధవ॥
యద్యప్యుపహతైః పాపైర్యదివాత్యంత దుష్కృతైః।
తథాపి సంస్మరేద్విష్ణుం సర్వపాపైః ప్రముచ్యతే॥
అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపివా।
యస్మరేత్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతర శ్శుచిః॥

**ఆత్మమార్జనమ్॥ (కూర్చతో కర్త తనపై నీరు జల్లుకోవాలి)**

శుచీవోహవ్యా మరుతశ్శుచీనాం శుచింహినో మ్యధ్వరం శుచిభ్యః ।
ఋతేన సత్యమృతసాప ఆయఇశ్శుచి జన్మాన శ్శుచయః పావకాః ॥
అగ్నిశ్శుచివ్రతతమ శ్శుచిర్విప్రశ్శుచిః కవిః ।శుచీరోచత ఆహుతః ॥
ఉదగ్నే శుచయస్తవ శుక్రా భ్రాజన్త ఈరతే।తవ జ్యోతీంష్యర్చయః ॥

ఏతోన్వింద్రం స్తవామ శుద్ధం శుద్ధేన సామ్నా ।
శుద్ధైరుక్థైర్వా వృధ్వాంసం శుద్ధ ఆశీర్వాన్మమత్తు ॥
ఇన్ద్ర శుద్ధోన ఆగహి శుద్ధ శ్శుద్ధాభి ర్వూతిభిః ।
శుద్ధోరయిం నిధారయ శుద్ధో మమద్ధి సోమ్యః ॥
ఇన్ద్ర శుద్ధో హినోరయిం శుద్ధోరత్నాని దాశుషే ।
శుద్ధో వృత్రాణి జిఘ్నసే శుద్ధో వాజం సిషాససి ॥

**బ్రాహ్మణ మార్జనమ్ ॥** **(కూర్చతో భోక్తలపై నీరు చల్లాలి)**

పావమానీ స్స్వస్త్యయనీ స్సుదుఘాహి ఘృతశ్చుతః ।
ఋషిభి స్సంభృతో రసో బ్రాహ్మణేష్వమృతం హితమ్ ॥
పావమానీర్దిశన్తున ఇమం లోకమథో అముమ్ ।
కామాన్త్సమర్ధయన్తునో దేవీర్దేవై స్సమాహితాః ॥
యేన దేవాః పవిత్రేణాత్మానం పునతే సదా ।
తేన సహస్రధారేణ పావమాన్యః పునన్తుమామ్ ॥
ప్రాజాపత్యం పవిత్రం శతోద్యామం హిరణ్మయమ్ ।
తేన బ్రహ్మ విదో వయం పూతం బ్రహ్మ పునీమహే ॥
ఇన్ద్రః పునీతీ సహమా పునాతు సోమస్స్వస్త్యా వరుణస్సమీచ్యా ।
యమోరాజాప్రమృణాభిః పునాతుమా జాతవేదా మూర్జయన్త్యాపునాతు॥

అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపివా।
యస్మరేత్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతర శ్శుచిః॥

గృహాణి సర్వాణి శుచినీ భవంతు।సర్వేపాకా శ్శుచయో భవంతు।
సర్వైర్ద్రవ్యై శ్శుచిర్భవతు॥ **(ఉదకాన్ని పల్లెంలో విడిచిపెట్టాలి.)**

దేవతాభ్యః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవచ।
నమస్స్వధాయై స్వాహాయై నిత్యమేవ నమోనమః॥
ఈశానః పితృరూపేణ మహాదేవో మహేశ్వరః।
ప్రీయతాం భగవానీశః పరమాత్మా సదాశివః॥ విష్ణుర్విష్ణుర్విష్ణుః ॥

**పరిషత్ప్రార్థనమ్॥** **(దర్భలు,అక్షతలు,తిలలు,చిల్లరపైసలతో భోక్తలచట్టూ 3సార్లు తిరగాలి)**

సతిల జల హిరణ్యదర్భాక్షతాన్ గృహీత్వా ॥బ్రాహ్మణానాం త్రిః ప్రదక్షిణమ్॥
సమస్త సంపత్సమవాప్తి హేతవ స్సముత్థితాపత్కుల ధూమకేతవః।
అపారసంసార సముద్రసేతవః పునంతుమాం బ్రాహ్మణ పాదపాంసవః॥
ఆపద్ఘనధ్వాంత సహస్రభానవ స్సమీహితార్థార్పణ కామధేనవః।
సమస్తతీర్థాంబు పవిత్రమూర్తయో రక్షంతుమాం బ్రాహ్మణ పాదపాంసవః॥
ఆధివ్యాధి హరంనృణాం మృత్యుదారిద్ర్య నాశనమ్।
శ్రీపుష్టికీర్తిదం వందే విప్రశ్రీ పాదపంకజమ్॥
విప్రౌఘదర్శనాత్సద్యః క్షీయంతే పాపరాశయః।
వందనాన్మంగలావాప్తి రర్చనాదచ్యుతం పదమ్॥
**(కర్త ఈ క్రింది మంత్రాన్ని చెప్తూ దర్భలు,అక్షతలు,తిలలు,చిల్లరపైసలు,నీళ్ళు పల్లెంలో విడవాలి)**
అశేషే హేపరిషత్ మదీయాం విజ్ఞాపనాం సమాగమ్య మయా సమర్పితామ్। ఇమాం పరిషత్ దక్షిణాం యథోక్తదక్షిణా మివస్వీకృత్య॥
నమో బ్రహ్మణ్యదేవాయ గో బ్రాహ్మణ హితాయచ।
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః॥
యావతీర్వై దేవతా స్తాస్సర్వా వేదవిది బ్రాహ్మణే వసంతి తస్మా ద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివేదివే నమస్కుర్యాన్నా శ్లీలం కీర్తయే దేతా ఏవ దేవతాః ప్రీణాతి॥

**(ప్రాచీనావీతి)(కింది మంత్రం చెప్పి దర్భలు అక్షతలు నువ్వులు నీళ్ళు పల్లెంలో విడవాలి)**
అస్మత్ పితుః /మాతుః ప్రతిసాంవత్సరిక మృతాహాఖ్యాన్న శ్రాద్ధం కర్తుం ముఖ్యకాలోభూత్వా మమ అధికార సంపదస్త్వితి భవంతో బ్రువంతు॥కర్తుం తవ అధికార సంపదస్తు॥
**(సవ్యం)**కాలాశ్చ ముఖ్యకాలో2స్తు।పాకాదీనాం పవిత్రతాస్తు।సర్వేపాకా శ్శుచయో భవంతు।సర్వైర్ద్రవ్యై శ్శుచిర్భవతు॥
దేవతాభ్యః పితృభ్యశ్చ మహాయోగిభ్య ఏవచ।
నమస్స్వధాయై స్వాహాయై నిత్యమేవ నమోనమః॥ **(భోక్తలకు నమస్కరించాలి)**

ఓం ఓం ఓం అద్య పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ।
**(ప్రాచీనావీతి)**అస్మత్ పితుః/మాతుః ప్రతిసాంవత్సరిక మృతాహాఖ్యాన్న శ్రాద్ధే పితృ పితామహ ప్రపితామహానాం ..... శర్మాణాం ..... గోత్రాణాం/ మాతృ పితామహీ ప్రపితామహీనాం .....దాయీనాం ...... గోత్రాణాం వసురుద్రాదిత్యరూపాణామ్। **(సవ్యం)** పురూరవార్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానాంచ అన్నేనహవిషా స్మృత్యుక్త పార్వణవిధానేన **(ప్రాచీనావీతి)**పితుః/ మాతుః ప్రతిసాంవత్సరిక మృతాహాఖ్యాన్న శ్రాద్ధే యుష్మదనుజ్ఞయా సదైవ మద్య **(సవ్యం)** కరిష్యే॥కురుష్వ॥
**(ప్రాచీనావీతి)** పితుః/మాతుః ప్రతిసాంవత్సరిక మృతాహాఖ్యాన్న శ్రాద్ధం భవిష్యతీతి తత్ర భవిష్యసి॥[1]
**(సవ్యం)**
విశ్వేదేవస్థానే హస్తోదకం దత్వా।పురూరవార్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానామ్। స్థానే ఆవహనీయార్థే క్షణం ధృత్వా భవద్భిః క్షణః ప్రసాదః కరణీయః॥[2] అస్తుకరణీయః॥
**(ప్రాచీనావీతి)**పితృస్థానే హస్తోదకం దత్వా।
పితృ పితామహ ప్రపితామహానాం ..... శర్మణాం ..... గోత్రాణాం / మాతృ పితామహీ ప్రపితామహీనాం .....దాయీనాం ...... గోత్రాణాం వసురుద్రాదిత్యరూపాణామ్। స్థానే ఆవహనీయార్థే క్షణం ధృత్వా భవద్భిః క్షణః ప్రసాదః కరణీయః॥[3] అస్తుకరణీయః॥
**(సవ్యం)**అక్రోధనై శ్శౌచపరై స్సతతం బ్రహ్మవాదిభిః।
భవితవ్యం భవద్భిశ్చ త్వయా/మయా చ శ్రాద్ధకర్మ కరిష్యే॥

---

**1.**కలశ అంచు సహాయంతో ఒక దర్భను తుంచి కలశలో ఉంచాలి. **2.**శిరస్సుపై అక్షతలు చల్లి దర్భలు చేతికి ఇవ్వాలి. **3.**శిరస్సుపై తిలలు చల్లి దర్భలు చేతికి ఇవ్వాలి.

గృహాంగణే గోమయేన మండలద్వయం కృత్వా॥[1]
ఉత్తరే చతురస్రమమ్॥[2] **(ప్రాచీనావీతి)**దక్షిణే వర్తులాకారమ్॥[3]
**(సవ్యం)**పురూరవార్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానామ్।పాద్యస్థానే ఇదమిదమాసనమ్।సుఖాసనమ్।పాద్యస్థానే దైవేక్షణః క్రియతామ్। పాద్యస్థానే అర్చతప్రార్చతః।అమీ గంధాః।పుష్పార్థా ఇమే అక్షతాః।అయం కుశః।ఉదకేనైవ సకలారాధనై స్స్వర్చితమస్తు॥

**(ప్రాచీనావీతి)**
పితృ పితామహ ప్రపితామహానాం ..... శర్మణాం ..... గోత్రాణాం/
మాతృ పితామహీ ప్రపితామహీనాం .....దాయీనాం ...... గోత్రాణాం
వసురుద్రాదిత్యరూపాణామ్।పాద్యస్థానే ఇదమిదమాసనమ్। సుఖాసనమ్। పాద్యస్థానే శ్రాద్ధేక్షణః క్రియతామ్। పాద్యస్థానే అర్చతప్రార్చతాః।అమీ గంధాః।పుష్పార్థా ఇమే తిలాః।అయం కుశః।ఉదకేనైవ సకలారాధనై స్స్వర్చితమస్తు॥
**(సవ్యం)**పురూరవార్ద్రవ సంజ్ఞకా విశ్వేదేవాః స్వాగతమ్।సుస్వాగతమ్॥[4]
పురూరవార్ద్రవ సంజ్ఞకా విశ్వేదేవాః ఇదం వః పాద్యమ్।సుపాద్యమ్॥
పవిత్రం విసృజ్య॥ (పవిత్రం తీసి కుడిచెవికి తగిలించాలి)
శంనోదేవీరభిష్టయ ఆపోభవన్తు పీతయే।శంయోరభి స్రవంతునః॥
పృథివ్యాం యానితీర్థాని తానితీర్థాని సాగరే।
సాగరే సర్వతీర్థాని పదే విప్రస్య దక్షిణే॥ **పవిత్రం ధృత్వా॥**
యదీచ్ఛసి మహారాజన్ సర్వతీర్థావ గాహనమ్।
విప్రపాద వినిర్ముక్తతోయం శిరసి ధారయ॥

---

**1.**ఇంటి వాకిలివద్ద కర్త తూర్పుముఖంగా కూర్చోని ఆవుపేడ లేద గంధం/పసుపుతో రెండు మండలాలను 6అంగుళాల దూరంలో నిర్మించాలి. **2.**చూపుడువేలు బొటనవేలు చాపగ వచ్చిన కొలత అనగా ప్రాదేశమాత్రంగా నైఋుతి నుండి ఈశాన్యానికి సవ్యంగా చతురస్రమండలం. **3.**వితస్తి అనగా 12 అంగుళాల పరిమాణంతో ఈశాన్యం నుండి నైఋుతికి అపసవ్యంగా వర్తులాకారమండలం నిర్మించాలి. **4.**కర్త పడమర ముఖంగా కూర్చొని భోక్తను చతురస్రమండలంపై పీఠమీద కూర్చోబెట్టి రెండు దర్భలతో అతని కుడికాలి పాదాలవేళ్లమీదుగా ఎడమవైపునకు తుడవాలి. **5.** కర్త యొక్క భార్య కర్తకు కుడిపక్కనుండి నీళ్లుపోస్తుండగా కర్త మొదట భోక్త యొక్క కుడికాలిని తరవాత ఎడమకాలిని కాలిపిక్కలు దాటకుండ కడగాలి. **గమనిక** విశ్వేదేవమండలమందు తూర్పుకొసగల దర్భలు నిలువుగా,పితృమండలమందు మధ్యకు వంచబడిన దర్భలు దక్షిణకొసగా ఉంచాలి.

**(ప్రాచీనావీతి)**

పితృ పితామహ ప్రపితామహాః /మాతృ పితామహీ ప్రపితామహ్యాః

స్వాగతమ్।సుస్వాగతమ్॥(భోక్త యొక్క ఎడమపాదం నుండి కుడివైపు 3దర్భలతో తుడవాలి)

పితృ పితామహ ప్రపితామహాః ..... శర్మాణః ..... గోత్రాః /

మాతృ పితామహీ ప్రపితామహ్యాః .....దాయ్యః ...... గోత్రాః

వసురుద్రాదిత్యరూపాః । ఇదం వః పాద్యమ్।సుపాద్యమ్॥

పవిత్రం విసృజ్య॥ (పవిత్రం తీసి కుడిచెవికి తగిలించాలి)

**(సవ్యం)**

శంనోదేవీరభిష్టయ ఆపోభవన్తు పీతయే।శంయోరభి స్రవంతునః॥

పృథివ్యాం యానితీర్థాని తానితీర్థాని సాగరే।

సాగరే సర్వతీర్థాని పదే విప్రస్య దక్షిణే॥**పవిత్రం ధృత్వా॥ (ప్రాచీనావీతి)**

యదీచ్ఛసి మహారాజన్ సర్వతీర్థావ గాహనమ్।

విప్రపాద వినిర్ముక్తతోయం శిరసి ధారయ॥

ద్వయోర్మండలయోర్మధ్యే పాత్రం నిక్షిప్య ॥**ఆకునుబోర్లించాలి** (పాషాణం నిధాయ)

**(కర్త భోక్తలు పాదప్రక్షాళన మండలానికి ఉత్తరంలో 2సార్లు ఆచమనం చేయాలి)**

**(సవ్యం)**కర్తాస్వయంచ పాదౌప్రక్షాళ్య।ఆచమ్య।కర్తాభోక్తారౌచ ద్విరాచమ్య॥

పురూరవార్ద్రవ సంజ్ఞకా విశ్వేదేవాః।భూర్భువస్సు స్స్వాహాస్తామ్।[1]

అయంవో విష్టరః।[2]అత్రోపవిశంతు భవంతః। అత్రోపవిశామ॥

**(ప్రాచీనావీతి)**

పితృ పితామహ ప్రపితామహాః /మాతృ పితామహీ ప్రపితామహ్యాః

భూర్భువస్సు స్స్వధాస్తామ్।[3]అయంతే విష్టరః।[4]అత్రోపవిశంతు భవంతః।

అత్రోపవిశామ॥

---

**1.**విశ్వేదేవ బ్రాహ్మణుని కుడిచేతి బొటనవేలు తప్ప మిగిలిన వేళ్లను కర్త తన కుడిచేత్తో పట్టుకొని తరవాత ఎడమచేతిని కూడా ఇలానే పట్టుకొని తూర్పుముఖంగా కూర్చోపెట్టాలి.

**2.**విష్టరార్థం రెండు దర్భలు విశ్వేదేవస్థానంలో బ్రాహ్మణునికి ఇవ్వాలి.

**3.**పితృస్థాన బ్రాహ్మణుని కుడిచేతి బొటనవేలు తప్ప మిగిలిన వేళ్లను కర్త తన కుడిచేత్తో పట్టుకొని తరవాత ఎడమచేతిని కూడా ఇలానే పట్టుకొని ఉత్తరముఖంగా కూర్చోపెట్టాలి.

**4.**విష్టరార్థం మూడు దర్భలు పితృస్థానంలో బ్రాహ్మణునికి ఇవ్వాలి.

**గమనిక –** విశ్వేదేవస్థానంలో ఇద్దరు బ్రాహ్మణులుంటే ఉత్తరసమాప్తిగా, పితృస్థానంలో ముగ్గురు బ్రాహ్మణులుంటే తూర్పుసమాప్తిగా కూర్చోపెట్టాలి.**కర్త విశ్వేదేవునికి ఉత్తర ముఖంగాను,పితరులకు ఆగ్నేయముఖంగా ఉపచారాలు చేయాలి.**

(**సవ్యం**) కర్తా ఆచమ్య ॥పూర్వ పవిత్రం విసృజ్య ॥అన్య పవిత్రం ధృత్వా ।

తపోష్పవిత్రం వితతం దివస్పతే శోచన్తో అస్య తన్తవో వ్యస్థిరన్।

అవన్త్యస్య పవీతార మాశవో దివస్పృష్ఠమధితిష్ఠన్తి చేతసా॥

కర్తా పునః ఆచమ్య । భోక్తారః ఆచమ్య । ప్రాణానాయమ్య(3సార్లు)।

ఓం ఓం ఓం అద్య పూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్టాయాం పుణ్యతిథౌ। (**ప్రాచీనావీతి**)అస్మత్ పితుః/మాతుః ప్రతిసాంవత్సరిక మృతాహాఖ్యాన్న శ్రాద్ధే భవదనుజ్ఞయా ప్రక్రాంతం శ్రాద్ధకర్మ (**సవ్యం**)కరిష్యే ।కురుష్వ ॥

(**ప్రాచీనావీతి**)

అపహతా అసురా రక్షాంసి పిశాచా యే క్షయన్తి పృథివీ మను।

అన్యత్రేతో గచ్ఛంతు యత్రైషాం గతం మనః॥సర్వతః తిలైరవకీర్య॥[1]

(**సవ్యం**)

ఉదీరతామవర ఉత్పరాస ఉన్మధ్యమాః పితర స్సోమ్యాసః ।

అసుంయ ఈయురవృకా ఋతజ్ఞా స్తేనో2వన్తు పితరో హవేషు॥జపిత్వా॥[2]

(**ప్రాచీనావీతి**) ఖనిత్వా వృత్తాకార మండలాని కృత్వా॥[3]

(**సవ్యం**) విశ్వేదేవస్థానే యవోదకేనావోక్ష్య॥చతురస్రమండలం కృత్వా॥[4]

గాయత్ర్యాచాత్మానం పాకద్రవ్యాణిచ సంప్రోక్ష్య॥[5]

ఓం భూర్భువస్సువః॥తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి॥ధియో యోనః ప్రచోదయాత్॥

అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతో2పివా।
యస్మరేత్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతర శ్శుచిః॥

---

**1.**కర్త చేతిలోకి నువ్వులు తీసుకొని నైఋతి నుండి దక్షిణసమాప్తిగా వాటిని చల్లాలి. మిగిలిన తిలలు పితృబ్రాహ్మణుని ముందు దక్షిణసమాప్తిగా మూడుచోట్ల దులపాలి **2.**కర్త ఈ మంత్రాన్ని జపించి **3.** పితృ బ్రాహ్మణుని ముందు దక్షిణసమాప్తిగా మూడుచోట్ల కూర్చతో నీళ్లుచల్లి దర్భలతో తుడిచి దర్భలతో తవ్వి అపసవ్యంగా మూడు వృత్తాకారమండలాలను నిర్మించాలి. **4.**విశ్వేదేవబ్రాహ్మణుని ముందు తూర్పుసమాప్తిగా రెండుచోట్ల అక్షతలుచల్లి కూర్చతో నీరు చల్లి దర్భలతో తుడిచి దర్భలతో తవ్వి సవ్యంగా రెండు చతురస్రమండలాలను నిర్మించాలి. **5.**అక్షతలు,దర్భలు,ఉదకాన్ని పట్టుకొని ఆ ఉదకాన్ని మొదటకర్తపై తరువాత భోక్తపై,ఆ పిదప పితృదేవతల కొరకై సిద్ధమైన వంటకాలపై ప్రోక్షించాలి.

శ్రాద్ధార్థం సంపాదితాః పదార్థాః దేశతః కాలతశ్చ శ్రాద్ధయోగ్యా హవిర్ముఖ్యా భవంత్వితి భవంతో బ్రువంతు॥శ్రాద్ధకాలే గయాం ధ్యాత్వా ధ్యాత్వాదేవం జనార్దనమ్।వస్వాదేవీంచ పితౄన్ ధ్యాత్వా తతః శ్రాద్ధం ప్రవర్తయే ప్రవర్తయ॥ **(అంటూ భోక్తలను నమస్కరించాలి)**

పురూరవార్ద్రవ సంజ్ఞకానాం విశ్వేషాం దేవానామ్। ఇదమిద మాసనమ్।[1]సుఖాసనమ్। హస్తోదకం దత్వా। విశ్వేదేవ దైవేక్షణః క్రియతామ్।[2] ఓం తథా ।ప్రాప్నువంతు భవంతః। ప్రాప్నువామ॥

ప్రాగగ్రాన్దర్భానాస్తీర్య। అర్ఘ్య పాత్రే ఆసాద్య। ఉత్తానేప్రోక్ష్య ।ఉద్ధృత్య। యవాన్వికీర్య। ఉదకమాపూర్య।

శంన్నోదేవీరితి సకృదభిమంత్ర్య।(ఒకే మంత్రంతో రెండు పాత్రల్లో నీళ్ళు పోయాలి)

శంనోదేవీరభిష్టయ ఆపోభవన్తు పీతయే।శంయోరభి స్రవంతునః॥

పురూరవ సంజ్ఞకేభ్యో విశ్వేభ్యోదేవేభ్యోవో జుష్టం గృహ్ణామి ॥

ఆర్ద్రవ సంజ్ఞకేభ్యో విశ్వేభ్యోదేవేభ్యోవో జుష్టం గృహ్ణామి॥ద్విస్తూష్ణీమ్॥

యవోఽసిధాన్యరాజోవా వారుణో మధు సంయుతః।

నిర్ణోద స్సర్వపాపానాం పవిత్ర మృషిభి స్మృతమ్॥

అర్ఘ్యపాత్రయోః। అర్చత ప్రార్చత। అమీ గంధాః। పుష్పార్థా ఇమే అక్షతాః। అయం కుశః। కూర్చోదకేనైవ అష్టార్ఘ్యై స్సంపూర్ణార్చన మస్తు।[3] దర్భై ప్రచ్ఛాద్య।[4]

పురూరవ సంజ్ఞకేభ్యో విశ్వేభ్యోదేవేభ్యోవో జుష్టం గృహ్ణామి ॥

ఆర్ద్రవ సంజ్ఞకేభ్యో విశ్వేభ్యోదేవేభ్యోవో జుష్టం గృహ్ణామి॥వః పాత్రే సంపన్నే।[5]సుసంపన్నే।స్వాహార్ఘ్యా స్స్వాహార్ఘ్యా స్సంత్వర్ఘ్యాః॥[6]

---

**1.** విశ్వేదేవ బ్రాహ్మణునికి ఆసనార్థమై పీఠకింద కుడివైపున కొన్ని దర్భలు తూర్పు కొసగా వేయాలి. **2.** భోక్త శిరస్సుపై అక్షతలు చల్లి రెండు దర్భలు చేతికి ఇవ్వాలి. **3.** కర్త గంధాక్షతలను అర్ఘ్యద్రవ్యాలను దొన్నెలో ఉంచి కూర్చోదకం చల్లాలి. **4.** దొన్నెలను దర్భలతో కప్పాలి. **5.** దొన్నెలను బోర్లించిన హస్తాలతో తాకాలి. **6.** విశ్వేదేవ బ్రాహ్మణునికి కర్త అర్ఘ్యమిచ్చురీతిలో అంజలిని చూపాలి.

పురూరవార్ద్రవ సంజ్ఞకాన్ విశ్వాన్ దేవాన్ భవత్స్వావాహయిష్యే।
ఆవాహ్య॥ [1]

విశ్వేదేవాస్త ఆగత శృణుతా మ ఇమం హవమ్। ఏదం
బర్హిర్నిషీదత॥విశ్వేదేవానావాహ్య॥

విశ్వేదేవా శ్శృణుతేమం హవంమ్మే యే అంతరిక్షే య ఉపద్యవిష్ఠ।
యేఅగ్నిజిహ్వా ఉతవాయజత్రా ఆసద్యాస్మిన్ బర్హిషి మాదయధ్వమ్॥ [2]

ఆగచ్ఛంతు మహాభాగా విశ్వేదేవా మహాబలాః ।
యే అత్ర విహితా శ్రాద్ధే సావధానా భవంతుతే॥ [3]సావధానాస్స్మః॥
హస్తోదకం దత్వా। హస్తోదకం గృహీత్వా॥ పాత్రోపరి దర్భాన్
బ్రాహ్మణాయ దద్యాత్। అధో దర్భాన్ స్వయం గృహీత్వా। పాత్రస్థ
అర్ఘ్యం గృహీత్వా॥

పురూరవ సంజ్ఞకా విశ్వేదేవా ఇదంవో అర్ఘ్యమ్। [4]అస్త్వర్ఘ్యమ్॥
యాదివ్యా ఆపః పృథివి సంబభూవుర్యా అంతరిక్ష్యా ఉతపార్థివీర్యాః।
హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శంస్యోనా స్వాహా భవంతు॥
తతశ్శుద్ధోదకమ్॥

పునః హస్తోదకం దత్వా। హస్తోదకం గృహీత్వా। పాత్రోపరి దర్భాన్ బ్రాహ్మ
ణాయ దద్యాత్।అధోదర్భాన్ స్వయం గృహీత్వా। పాత్రస్థ అర్ఘ్యం గృహీత్వా॥

---

**1.**రెండు దర్భలను గంధంలోముంచి అక్షతలను అద్ది కర్తఎడమచేతిని భోక్తకుడి మోకాలిపై ఉంచి వాటిని విశ్వేదేవ బ్రాహ్మణుని శిరస్సుపై ఉంచాలి. **2.**భోక్త ఎడమపాదము నుండి శిరస్సువరకు అక్షతలు చల్లి మిగిలినవి నేలపై విదిలించాలి. **3.**కర్త భోక్తను నమస్కరించాలి. **4.**దొన్నెపైనున్న దర్భలను తూర్పుకొసగా భోక్తకిచ్చి కింది దర్భలను కర్త కుడిచేతిలోనికి తీసుకొని ఎడమచేతితో దొన్నెలోని నీటిని కర్తకుడిచేతి దర్భ ద్వారా ధారగా విడుస్తూ **'యాదివ్యా'** మంత్రం చెప్తూచూడాలి.పూర్తిగా దొన్నెలో నీటిని విడువరాదు కొంచం మిగల్చాలి.అర్ఘ్యం ఇచ్చి ఆ పాత్రను యథాస్థానంలోనే దర్భవేసి పెట్టాలి.

ఆర్ద్రవ సంజ్ఞకా విశ్వేదేవా ఇదంవో అర్ఘ్యమ్।[1] అస్త్వర్ఘ్యమ్॥

యాద్దివ్యా ఆపః పృథివి సంబభూవుర్యా అంతరిక్ష్యా ఉతపార్థివీర్యాః।

హిరణ్యవర్ణా యజ్ఞియాస్తాన ఆపశ్శంస్యోనా స్వాహా భవంతు॥

విశ్వేభ్యోదేవేభ్యః ॥పాత్రేస్థానేస్థః।[2]సుస్థానమసి॥తతశ్శుద్ధోదకమ్॥

హస్తోదకం దత్వా।తతః అర్చనమ్॥

అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత।

అర్చన్తు పుత్రకా ఉతపురంన ధృష్ణ్వర్చత॥యవైరభ్యర్చ్య॥

పవిత్రం విసృజ్య।గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్।

ఈశ్వరీం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్॥

పురూరవార్ద్రవ సంజ్ఞకా విశ్వేదేవాః యథాభాగశః।అమీవో గంధాః।[3]

సుగంధాః॥పవిత్రం ధృత్వా॥

ఆయనేతే పరాయణే దూర్వారోహన్తు పుష్పిణీః ।

హ్రదాశ్చ పుణ్డరీకాణి సముద్రస్య గృహా ఇమే ॥

పుష్పార్థా ఇమే అక్షతాః।సుపుష్పాణి॥

ధూరసి ధూర్వధూర్వంతం ధూర్వతంయో2స్మాన్ధూర్వతి తంధూర్వయం

వయంధూర్వామః॥ఉదకద్రవ్యేణైవ సాంకల్పికంవో ధూపః।[4]సుధూపః॥

ఉద్దీప్యస్వ జాతవేదో2పఘ్నన్నిరృతిం మమ।పశూగ్శ్చ మహ్యామావహ

జీవనంచ దిశోదిశ॥జ్వాలాభేదేన పూర్వదిక్ స్థిత మిదంవో జ్యోతిః।[5]సుజ్యోతిః॥

---

**1.** మునుపటి పాత్రవలే చేయాలి. **2.** భోక్తకు పడమర ఉన్న దొన్నెలో తూర్పు దొన్నెలో నీటిని పూర్తిగాపోసి భోక్తకు కుడిపక్క దర్భ,అక్షతలు వేసి అక్కడ ఆ పడమటి దొన్నెను ఉంచి దానిపై ఖాళీగా ఉన్న ఈ తూర్పుదొన్నెను బోర్లించాలి. **3.** కూర్చపై గంధపు ఆకును పెట్టి ఇవ్వాలి. **4.** భోక్త చేతిపై కూర్చోదకాన్ని చల్లాలి. **5.** తూర్పువైపున గల దీపాన్ని భోక్తకు చూపి కర్త ఆ దీపాన్ని నమస్కరించాలి.

యువాసువాసాః పరివీత ఆగాత్స ఉ శ్రేయాన్భవతి జాయమానః।
తంధీరాసః కవయ ఉన్నయన్తి స్వాధ్యో౩మనసా దేవయన్తః॥
అంతః ప్రావరణార్థం బహిః ప్రావరణార్థం ఇదం వాసః। [1]సువాసః।
ఆచ్ఛాదనార్థం అలంకరణార్థం సాక్షతా ఇమే కుశాః। [2]సుకుశాః॥
అర్చనం సంపూర్ణమ్।భవతాం అస్తు సంకల్ప సిద్ధిరస్త్వితి భవంతో
బ్రువంతు।భవతాం అస్తు సంకల్ప సిద్ధిరస్తు॥ [3]
యుష్మదనుజ్ఞయా పిత్రాద్యర్చనం/మాత్రాద్యర్చనం కరిష్యే॥
**(ప్రాచీనావీతి)**
పితృ పితామహ ప్రపితామహానాం ..... శర్మణాం ..... గోత్రాణాం /
మాతృ పితామహి ప్రపితామహీనాం .....దాయీనాం ...... గోత్రాణాం
వసురుద్రాదిత్యరూపాణామ్।ఇదమిద మాసనమ్। [4]సుఖాసనమ్।
హస్తోదకం దత్వా। పితుః/మాతుః ప్రతిసాంవత్సరిక మృతాహోఖ్యాన్న
శ్రాద్ధే క్షణః క్రియతామ్। [5]ఓం తథా। ప్రాప్నువంతు భవంతః। ప్రాప్నువామ॥
దక్షిణాగ్రాన్ దర్భానాస్తీర్య। అర్ఘ్య పాత్రే ఆసాద్య ।ఉత్తానేప్రోక్ష్య।ఉద్ధృత్య।
తిలాన్వికీర్య। ఉదకమాపూర్య।
శంనోదేవీరితి సకృదభిమంత్ర్య।(ఒకే మంత్రంతో మూడు పాత్రల్లో నీళ్ళు పోయాలి)
శంనోదేవీరభిష్టయ ఆపోభవన్తు పీతయే।శంయోరభి స్రవంతునః॥
పిత్రేతేవో జుష్టం గృహ్ణామి। పితామహాయ తేవో జుష్టం గృహ్ణామి।
ప్రపితామహాయ తేవో జుష్టం గృహ్ణామి॥ త్రిస్తూష్ణీమ్॥

---

**1.** తడపగా ఆరిన మడిపంచ,ఉత్తరీయ,యజ్ఞోపవీతాలను దర్భ,అక్షతలతో చేర్చి,అక్షతలు శిరస్సుపై వేసి పంచాదులు మిగిలినవి చేతికి ఇవ్వాలి. **2.** అలంకరణార్థం దర్భ,అక్షతలు పట్టుకొని అక్షతలు శిరస్సుపై దర్భలు చేతికి ఇవ్వాలి. **3.** దర్భ,అక్షతలను నీటితో జోడించి పల్లెంలో విడిచిపెట్టాలి. **4.** పితృ బ్రాహ్మణునికి ఆసనార్థమై పీటకింద ఎడమవైపున మడిచిన దర్భలు దక్షిణకొసగా వేయాలి. **5.** భోక్త శిరస్సుపై తిలలు చల్లి మూడు దర్భలు చేతికి ఇవ్వాలి.

